## ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణావకాశాలు

### సన్నగిల్లిపోలేదని ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 5:

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు, అఖిలభారత రైతుకాంగ్రెసు ప్రధానకార్యదర్శి శ్రీ యన్. వి. నాయుడుగారు, ఆంధ్రరాష్ట్ర రైతుకాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ చేగిరెడ్డి బాషిరెడ్డిగారు యీ క్రింది సంయుక్త ప్రకటన చేశారు:—

శ్రీ లంక సుందరంగారు ఆంధ్రరాష్ట్ర సత్వరనిర్మాణావకాశాలు సన్నగిల్లిపోయినవంటూ ఫిబ్రవరి 29 వ తేదీ ఆంధ్రపత్రికా ముఖమున చేసిన ప్రకటన ఆశ్చర్యమును కల్గించినది. వారి ప్రకటన చదివిన ప్రతివ్యక్తికీ ఆంధ్రరాష్ట్ర సంపాదనా ప్రయత్నమున ఆంధ్రనాయకులలో ఐకమత్యం లేదనియు, "ఎవరికివారే యమునాతీరే" అన్నట్లు వారు నడచుకొనుచున్నారనియు సందేహము కలుగక మానదు. ఆంధ్రరాష్ట్ర సిద్ధికై ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య రంగాగారు ఇతరత్ర ఆంధ్రనాయకులు, పరస్పర సమాలోచన పూర్వకముగ సహకారము నెరపుకొనుచు సమిష్టి ప్రయత్నము జరుపుచుండగా, లంక సుందరంగారికి, పూర్వాపర సందర్భములతో నిమిత్తములేని సంశయము పొడమించుట విచారకరము. వీరి సంశయము నిరాధారము.

రాజ్యాంగచట్టపు ముసాయిదాలో ప్రత్యేకముగ ఆంధ్రరాష్ట్రమును పేర్కొనక పోయినంతమాత్రముచే, ఆంధ్రరాష్ట్ర సిద్ధి అచిరకాలమున లేదని శంకించుటకు హేతువు కానరాదు. ముసాయిదాలో ఆంధ్రరాష్ట్రము సూచింపబడని యెడల, రాష్ట్రసిద్ధి అత్యంత దుర్లభమనియు, లేకున్న అసంభవమనియు భావించి, సిద్ధింపనున్న ఫలము దూరమైపోయినదని అసంతుష్టులై ఆంధ్ర నాయకుల కృషి ఏకముఖమున కాక, భిన్నముఖముల సమరసభావము లేక జరుగుచున్నదని, యిందుకై అనావశ్యకముగ ఆంధ్ర నాయకులను విమర్శింపబూనుట ముదావహము కానేరదు.

ఆంధ్రరాష్ట్ర సాధన విషయమున ఆచార్య రంగాగారు, ప్రకాశం పంతులుగారు, డా॥ పట్టాభిగారు, అనంతశయనం అయ్యంగారు మున్నగు నాయకులు పరస్పర సమాలోచనలతో కృషిసల్పిరి, సల్పుచున్నారు. ఆచార్య రంగాగారు యీ నాయకుల తోడనేగాక, ఆంధ్రరాష్ట్ర సంపాదనా విషయమున కృషిసల్పుచు తత్సంబంధముగల పెద్దపురుషులతో సలహా సంప్రదింపులు సల్పుచున్నారనుట ఆంధ్ర సోదరులకు విదితమే. ఆచార్య రంగాగారు దుమ్మిడిదల సుబ్బారావు గారితోడను, ఒరిస్సా ఆంధ్రనాయకుల తోడను, అవసరమైనప్పుడెల్లా ప్రకాశం పంతులుగారితోను, ఆంధ్రమహాసభాధ్యక్షులు, అప్పారావు గారితోను, మహర్షి తమరావు గారితోను, రాయలసీమ నాయకులతోను తరుచు రాష్ట్ర ప్రయత్న విషయమున జరుపుచున్న సంప్రదింపులు పత్రికాపాఠకుల కెల్లరకు తెలిసిన విషయమే.

భారత శాసనసభలో ప్రధాని నెహ్రూ ఆంధ్రరాష్ట్ర సమస్య గూర్చి రంగాగారి ప్రశ్నకు యిచ్చిన సమాధానమును అవిమయముగా జరిగిన కృషియావత్తు డా॥ పట్టాభి, ఆచార్యరంగా, అనంతశయనంగార్లు ఏకంగా చేసినదే. రాష్ట్ర సంపాదనా ప్రయత్నమున అన్ని సందర్భములలో అన్ని ఘట్టములలో యిట్టి యెట్టి ఆచార్యరంగాగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఆంధ్ర నాయకులందరితో సంప్రదించుచు సలహాలను బడయుచు సమిష్టి ప్రయత్నమును చేయుచు చేయిస్తున్నారు. కాన రాష్ట్ర సంపాదనా ప్రయత్నమున ఆంధ్రనాయకులలో ఐకమత్యము లేదనియు ఆకారణముచే సత్వర రాష్ట్ర నిర్మాణావకాశములు సన్నగిల్లిపోవుచున్నవని చింతిల్లవలదు. రాష్ట్రసిద్ధికి, అందున సత్వర సిద్ధికి కెట్టిని యెట్టి ఆటంకములు లేవని ముసాయిదాలో పేర్కొనబడిన కారణములను విశాలదృష్టితో పరికించినవారికి తెలియక మానదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గూర్చి గాంధి మహాత్ముడు, పండిత నెహ్రూ ఆవాశ్యకతా నిశ్చయముతో కావించిన ప్రకటనలను సందేహించుట హ్రస్వ దృష్టియే కాగలదు.

భారత స్వాతంత్ర్య మరమున మందం చేసిన ఆంధ్రుల చిరకాల వాంఛితమగు ఆంధ్రరాష్ట్రసిద్ధికి మన జాతీయ నాయకత్వము అడ్డుతగులునని కాని, సంకుచిత చిత్తముతో నున్నదని గాని అనుమానించుట గౌరవప్రదము కానేరదు. జాతీయ మహానాయకులు మన ప్రధాని నెహ్రూ భావాలజాతీయ ఆదర్శమును గుర్తెరిగి, యీనాటి జాతీయ క్లిష్టసమయమునందు, మన రాష్ట్ర సంపాదనా ప్రయత్నములో మానవుల పరమ్యంతము అలక్ష్యమను చున్నా ఓర్పు చూపెటుట మన ఆంధ్రజాతీయ

## మునిసిపల్ విద్యాశాఖ సూపర్‌వైజర్ పదవీ విరమణ

### వీడ్కోలు సన్మానసభ

మచిలీపట్నం, మార్చి 2: ఈ పట్టణ మునిసిపల్ విద్యాశాఖ సూపర్‌వైజరుగా 25 సం॥ ములనుంచి పనిచేసి 18-2-48 తేదీన పదవి విరమణపొందిన శ్రీపాదరాజ కృష్ణవేణేశ్వరరావుపంతులుగారికి, మునిసిపల్ పాఠశాల ఉపాధ్యాయులు మొన్న వీడ్కోలువన్మానము చేసిరి. పురపాలక సంఘాధ్యక్షుడు డా॥ రాళ్లపల్లి అచ్యుత రామయ్యగారు అధ్యక్షత వహించిరి. చాలాకాలము కౌన్సిలరుగానున్న శ్రీ సుదుమూరి వీరభద్రయ్యపంతులుగారు వేణేశ్వరరావుగారి చాకచక్యమునుగురించి నిర్బంధప్రాథమిక విద్య ప్రారంభించినప్పటినుండి వారు ప్రాథమికవిద్యావ్యాప్తికై చేసిన కృషిని, మెక్కలి ప్రశంసించిరి. వేణేశ్వరరావుగారు తమపట్ల చూపిన ఆదరణనుగురించి చాలామంది ఉపాధ్యాయులు ఉపన్యసించిరి. అధ్యక్షులు ఉపన్యసించుచూ, వేణేశ్వరరావుగారి గుణగణములను ప్రశంసించి ఉపాధ్యాయులు వయోజనవిద్యకొరకు పాటుపడవలెనని హెచ్చరించిరి.

ఉపాధ్యాయులు, గాంధిమహాత్ముని బోధనలు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరాయ విరచిత "భగవద్గీత"ను వేణేశ్వరరావు గారికి బహుమతిచేయుచు వారు తరచుగా దేశోద్ధారకుని జీవితాశయమును గురించి చెప్పుచుండెడివారని చెప్పిరి. వేణేశ్వరరావుగారు తమకు చేసిన సన్మానమునకు తమనుగూర్చి పెద్దలు దయతో చెప్పిన విషయములకు కృతజ్ఞత దెల్పుచూ ఉపాధ్యాయులు తమ వృత్తియొక్క యుపయోగమును కనుకొని నడవలెనని శ్రద్ధతో సవరించుచూ, అధికారులకు అణకువవలెనని జ్ఞాపకముంచవలెనని హెచ్చరించిరి. ఈ సందర్భమున ఉపాధ్యాయులు తేనీటివిందొసంగిరి.

### పల్లెల్లో వైద్యాలయాలు

పల్లె ప్రాంతాల్లో జిల్లాబోర్డుల అధ్యక్షం క్రింద ఉన్న వైద్యాలయాలను సమీప గ్రామాలన్నిటికీ ఉపకరించే విధంగా కార్యక్రమం తయారుచేసే విషయమై మద్రాసు ప్రభుత్వం జిల్లాబోర్డుల అభిప్రాయాలను తెలుపవలసిందని లేఖలుపంపినట్లు తెలుస్తున్నది.

### అనాధ శిశురక్షణనిమిత్తం శాసనం

అనాధ శిశువుల రక్షణనిమిత్తం, వికలాంగులైన భిక్షుల ఉపకారంనిమిత్తం దేశంలోని వివిధ ధర్మసంస్థలు చేస్తున్న సేవను ప్రభుత్వమే చేకొన దలచిందనీ, దీనికొరకు సమగ్రమైన శాసనం ప్రవేశపెట్ట దలచినామనీ, మంత్రి మాధవమీనన్‌గారు చెన్నపురి శిశు సహాయసంస్థ వార్షిక సమావేశంలో ఉపన్యసిస్తూ తెలిపారు.

## గోధుమల గరిష్ఠ కనిష్ఠ ధరలు

వాషింగ్టన్, మార్చి 4: వచ్చే 5 ఏళ్లవరకూ గోధుమల గరిష్ఠ ధరనూ కనిష్ఠ ధరనూ నిర్ణయిస్తూ అంతర్జాతీయ గోధుమ సమావేశం నేడు ఒక సమాధానానికి వచ్చింది. శనివారం నాడు అంతిమ సమావేశం జరగుతుందనీ, ఈ సమాధానపు షరతులపై అప్పుడు బహుశా ఒక ప్రకటన జరుగవచ్చుననీ కొందరు సమావేశ ఉద్యోగులు అంటున్నారు.

గంభీరతకు తగునేకాని అందువల్ల మనకు కల్గు నష్టమెంతమాత్రము ముండబోదు

పన్నెండు సంవత్సరములపిదప, మార్చి 14 వ తేదీకి మనప్రధాని నెహ్రూపండితుడు విశాఖపట్నం వచ్చుచున్నాడు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశము జరిపి ఆ సమావేశములో పండిత నెహ్రూ ప్రసంగించుటయూ, ఆంధ్రుల భావములను ప్రధానియు, ప్రధాని భావములను ఆంధ్రులునూ, సుహృద్భావముతో గ్రహించుకొనుటకు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య రంగాగారు ఏర్పాటు గావించుచుండుట, సంతసింపదగినదున్నది.

ఈ శుభావసరమునకు రా॥ కాం॥ పక్షమున ఆచార్యరంగాగారు ఆంధ్రమంత్రులను, రాష్ట్రకేంద్రశాసన సభ్యులను ఇతర ఆంధ్రనాయకులను, కాంగ్రెసు అనుబంధ సంఘములను ముఖ్యంగా ప్రకాశంగారిని, ఢిల్లీనుండి డా॥ పట్టాభిగారిని ఆహ్వానించుచున్నారు. ఇట్టి పరిస్థితులలో ఆంధ్రనాయకులలో భేదాభిప్రాయాలు కలవనియు, రాష్ట్రసిద్ధికి కల అవకాశములు సన్నగిల్లిపోయినవనియు యెవ్వరు భ్రమింపనవసరములేదు. నెహ్రూ పండితుని నాయకత్వమున ఆంధ్రరాష్ట్రము అచిరకాలములోనే సిద్ధింపగల శుభలక్షణములు కలవనియు, అట్టి నాయకత్వమును సంకోచింపక, శ్రద్ధా భక్తులతో గౌరవించుట ఆంధ్రుల ధర్మము మన జాతీయ ప్రధాని నెహ్రూగారి మాటల యందు విశ్వాసముంచుట ద్వారా రాష్ట్రము సిద్ధించుటకు హెచ్చు అవకాశము గలదని మా విశ్వాసము.

## అంటార్కిటిక్ ప్రాంతాలపై హక్కులు

### చిలీ, అర్జెంటినాల పరస్పర సహాయ ఒడంబడిక

బ్యూనాస్ ఏర్స్, మార్చి 5: దక్షిణ ధ్రువప్రాంతంపై తమహక్కులను బలపరచుకోటానికి అర్జెంటినా, చిలీ ప్రభుత్వాలు గతరాత్రి పరస్పర రక్షణ ఒడంబడికను చేసుకుంది. అంటార్కిటిక్ ప్రాంతంలోనున్న దక్షిణ అమెరికన్ భూభాగాలపై తమ హక్కులను బలపరుచుకొనే నిమిత్తము ఈ ఒడంబడికను తాము చేసుకున్నట్లు అర్జెంటినా విదేశీమంత్రి డా॥ జాన్ బ్రామగ్లియా పత్రికా ప్రతినిధుల సమావేశంలో తెలియజేశాను. అక్కడ నిర్వివాదమైన ఉభయుల స్వాతంత్ర్య హక్కులను ఈ ఒడంబడికద్వారా చిలీ, అర్జెంటినాలు బలపరుచుకో నలచినవట.

## నిమ్నజాతి సభనుంచి అగ్నిభోజ్ రాజీనామా

నాగపూర్, మార్చి 4: సి. పి. బీరార్ ప్రభుత్వంలో పబ్లిక్ సర్వీస్ శాఖా మంత్రిగా పనిచేస్తున్న రామేశ్వర్ అగ్నిభోజ్ గారు అఖిలభారత నిమ్నజాతి మహాసభ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. రాజీనామాను జగజీవన్‌రామ్‌గారికి అందజేశారు. మహాత్ముని హత్యకారణంగా దేశంలో రాజకీయసంస్థల స్వరూపాలే మారిపోయినవనీ, కులతత్వ సంస్థలకు స్థానం లేదని అగ్నిభోజ్ గారు రాజీనామాలో తెలియజేశారు. అచిరకాలంలోనే నిమ్నజాతి మహాసభను రద్దుచేయక తప్పదని కూడా అన్నారు. షెడ్యూల్డ్ తరగతులనీ, నిమ్నజాతులనీ, ఆదిమవాసులనీ పేర్లుపెట్టి ఒక తెగను విలక్షణం మంచిది కాదని, నూత్న రాజ్యాంగంలో ఈ పేర్లను ఉదహరించరాదనీ ప్రధాని నెహ్రూకు కూడా వీరు ఒక లేఖ వ్రాశారు. వీటి బదులు 'ప్రివిలెజికాల్డ్ క్లాసెస్' అనడం మంచిదని సూచించారు. (యు. ప్రె.)

## ఇకనుంచి న్యాయవాదులవిధులు

### రామకృష్ణరాజుగారి ఉపన్యాసం

చెన్నపట్నం, మార్చి 5: "ఇంగ్లీషులో వాదించటం మూలాన, న్యాయవాది ఏం మాట్లాడుతున్నాడో, ఇంతవరకు మన అమాయక ప్రజలకు తెలిసేదికాదు. ఇకనుంచి ప్రభుత్వ వ్యవహారాలన్నీ మాతృభాషలోనే నడుస్తాయి. కాబట్టి ప్లీడర్లు జాగ్రత్తపడాలి. అయినా ఇకనుంచి కేసులు కూడా తగ్గవచ్చు. న్యాయవాదులు గ్రామీణుల సమస్యల్ని పెద్దమనుష్యుల్లాగా పరిష్కరించి, వారికయ్యే ధనవ్యయాన్ని, శ్రమను తగ్గించవచ్చు. కోర్టు పక్షులమూలాన చాలామంది రైతులు చెడిపోయ్యారు." అని శ్రీ రామకృష్ణంరాజు లాకాలేజి ఆంధ్రసంఘపు వార్షికోత్సవ సభలో చెప్పారు. ప్రిన్సిపాల్ శ్రీ గోవిందరాజులు అధ్యక్షత వహించారు. శ్రీ ఇ. వెంకటేశ్వర్లు—ఆంధ్ర విద్యార్థి సంఘపు అధ్యక్షులుకూడా వేదికపై ఆసీనులయ్యారు.

ప్రార్థనానంతరం శ్రీ సూర్యారావు సంవత్సర నివేదికను వినిపించారు. కేశవేంద్ర శర్మ, అచ్యుత రామరాజుగారలు స్వాగతం చేసినతర్వాత శ్రీ వరదారెడ్డి బి. యల్. విద్యార్థులకు వీడ్కోలిచ్చారు. బి. యల్. విద్యార్థులతరఫున శ్రీ అచ్యుత రామరాజు యఫ్. యల్. విద్యార్థులకు కృతజ్ఞత తెల్పారు. శ్రీ రామకృష్ణరాజు వ్యాసరచన పోటీలో ప్రథమ, ద్వితీయ స్థానాలను పొందిన సత్యనారాయణగారు, శ్రీరాములుగార్లకు వెండికప్పులను బహుమతిగా ఇచ్చారు. శ్రీ రామకృష్ణరాజు మాట్లాడుతూ ప్రస్తుత న్యాయపద్ధతులు మన దేశాచారానుగుణంగా లేవన్నారు. కోర్టులో మద్దాయిని ప్రశ్నించే అవకాశమే లేదు. అంతా సాక్ష్యంపైన ఆధారపడటం జరుగుతోంది. తెలివైన ప్లీడరు అవుతే సాక్ష్యాన్ని తల్లక్రిందులు చేస్తాడు. ఈపద్ధతి మారాలని రాజుగారన్నారు.

శ్రీ గోవిందరాజులు తమ అధ్యక్షోపన్యాసంలో, విద్యార్థులు దేశశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని విశేషాల్ని, ఆంధ్రదేశాన్ని విస్మరించాలని సలహాయిచ్చారు. శ్రీమతి బాలసరస్వతి సంగీతానంతరం కార్యదర్శి వందనాలతో కార్యక్రమం ముగిసింది

## అఖిల భారత కిసాను కాంగ్రెసు

### ఏలూరులో రంగాగారి అధ్యక్షతను సమావేశం

బెజవాడ, మార్చి 5: అఖిల భారత కిసాను కాంగ్రెసు ఏలూరులో ఏప్రెలు నెల చివరి వారములో ప్రొఫెసరు యన్. జి. రంగాగారి అధ్యక్షతను జరుగును. ఇండియా ప్రభుత్వ కాశ్మీర్ శాఖామంత్రి జగ్జీవన్‌రాంగారు సభను ఉపక్రమించుటకంగీకరించిరి. అప్పుడు అ. భా. వ్యవసాయ పారిశ్రామిక ప్రదర్శనము ప్రదర్శనముకూడా జరుపబడును.

